శ్రీ

# అభినవసరస్వతి

యను సచిత్ర మాసపత్రిక

అష్టావధాని. జానపాటి పట్టాభిరామశాస్త్రిచేఁ

బ్రచురింపఁబడుచున్నది.

గుంటూరుజిల్లా, పల్నాడుతాలూకా, జానపాడు.


| | | |
|---|---|---|
| సంపుటము 6 | 1914 జనవరి | సంచిక 1 |


విషయములు.





చందానిర్ణయము సంవత్సరమునకు

| | | | |
|---|---|---|---|
| ప్రధానపోషకులకు | రు 25 0 0 | సహాయులకు | రు 5 0 0 |
| పోషకులకు | రు 10 0 0 | చందాదారులకు | 2 0 0 |


చంద్రికాముద్రాక్షరశాల, గుంటూరు.

Printed at the Chandrika Press, Guntur
and Published at Janapadu, by the Editor Ashtavadhani
Janapati Pattabhirama Sastry.

అభినవసరస్వతీ కార్యస్థానమున వెలకు దొరకు పుస్తకములు :—

| | | | |
|---|---|---|---|
| 1 | అళ్ళయాచార్యవిజయము ... ... | | రు. 0- 4-0 |
| 2 | కరిణీకోద్ధారిణి ... ... | | 0- 4-0 |
| 3 | వాసంతికాపరిణయము | ఇవి నాటకములు | 0- 4-0 |
| 4 | కంసవధము | | 0- 8-0 |
| 5 | చమత్కారమంజరి ... ... | | 0- 4-0 |
| 6 | విసూపాతుసీరగురుపరంపర ... ... | | 0- 2-0 |
| 7 | నీతిగీతలు (సుమతిశతకమునకు సంస్కృతము) | | 0- 2-0 |
| 8 | వత్సలనీతిశతకము ... ... | | 0- 1-0 |
| 9 | విశ్వబ్రాహ్మణశబ్దఖండనము ... ... | | 0- 2-0 |
| 1 | అత్యద్భుతవిమర్శనము ... ... | | 0- 5-0 |
| 11 | నర్సరావుపేటశతావధానము (తిరుపతివేంకటీయము) . | | 0- 3-0 |
| 12 | లక్ష్మీవిలాసము ... ... | | 0- 4-0 |
| 13 | చిత్తూరుజిల్లా తీర్పువిమర్శనము ... | | 0- 4-0 |
| 14 | పశ్యాంపుశ్యాం ... ... | | 0- 2-0 |
| 15 | సంగదోషము ... ... | | 0- 3-0 |
| 16 | పశ్యశబ్దవిచారము ... ... | | 0- 3-0 |
| 17 | వీరభాగవతము ... ... | | 1- 4-0 |
| 18 | పుళిందావివాహము ... ... | | 0- 4-0 |
| 19 | గురిగింజ ... ... | | 0- 1-0 |
| 20 | గుంటూరుసీమ, తిరుపతివేంకటీయము ... | | 1- 0-0 |
| 21 | వేమవరాగ్రహారశతావధానము ... | | 0-12-0 |
| 22 | పిష్టపేషణము ... ... | | 0- 1-0 |
| 23 | వ్యాసనిష్కాసనము ... ... | | 0- 1-0 |

అభినవసరస్వతి

సంపుట 6. | జూను మాసము ప్రమాది సం॥ జ్యేష్ఠమాసము | సంచిక 1.

# స్వ వి ష య ము.

చ॥ పదుగురియాదరంబునకుఁ బాత్రుఁడఁగాఁగఁదలంచి మీకు నే
నిఁకె మొదలస్మదీయమగు నీనెలపేపరు పంపుచుందు నో
చదువరులార! పంపఁబడుసంచికలన్నియుస్వీకరించుచున్
సదయులరౌచుఁ దత్క్రయము చయ్యనఁబంపఁగ నుద్యమించుఁడీ॥

తే॥ అభిమతము లేకయుండిన నాదినుండి
వచ్చువాని నెమరలింప నిచ్చఁగొనుఁడు
వీపిమాత్ర మెమరలించు పాపమునకుఁ
బాలుపడకుఁడు గ్రహియించి ప్రార్థనముల॥

ఈరీతి నెన్ని సారులు ప్రచురించుచున్నను నెందఱెందఱో వీపీలు తిరుగఁగొట్టునాచారము మాత్రము మానరైరి. ఒండు రెండు కాదుఁ కదా? తుద కయిదాఱుసంచికలుపుట్టినవారివీపీలుతిరిగివచ్చినందులకుఁ గూడ మే మంతగా విచారింపము గాని కొందఱు 11 సంచికలవఱకును బత్రికం గైకొని సంవత్సరాంతమగుటఁ దుదిసంచిక విధిలేక వీపిపంపి నప్పుడుమాత్రము త్రిప్పివేయుచుండిరి.

మా కెక్కువపరిచయము లేనివారికిని, పెద్దమనుష్యులుగాఁబొడకట్టని వారికిని నొకటిరెండుసంచికలే యూరకపంపి యాపై వీపీచేసి లాభమో నష్టమో యేదియో యొకటి తేల్చుకొందుము. పరిచితిగలవారికిని బత్రికపై నభిమానముగలవారికిని ప్రతిష్ఠగలవారికిని సాధ్యమయి నంతవఱకు సమావేశముచేయఁదలఁచియు వారలేపంపుదురనియెంచి యు, చాలకాలముగడపి విధిలేక సంవత్సరాంతమునకే వీపీపంపుట యాచారమై యున్నయది. అప్పటికిని "మనకుఁగూడ వీపీచేయవలెనా" యనియు జవానువీపీతెచ్చినప్పుడు నోటీసుపై దస్కతుచేసి మరలనది

తెచ్చికొనకయు సమయమునకుఁ జేతిలోఁ బైకము లేకయు నుండియు నెంతయభిమానాదరములుగలిగియుండినను సహజసౌభ్యముచే నొసఁగ లేకయు నిట్లనేకవిధముల నుపకరించినవారే యగుచున్నారు. దయయుంచి మము క్లిష్టనష్టములపాలుచేయక యుచితపద్ధతియందే యుండుట కవ్వారలనందఱు నభ్యర్థించుచున్నవారము. పత్రికపైఁగాని మాపైఁగాని యెవ్వియో కారణములచే నుపేక్షజనించినవారు వెంటనే "పత్రిక పంపవల"దని తెలిపి శ్లాఘాపాత్రులగుట మా కిది కాని సంవత్సరాంతము సరిగాఁ గైకొని చందాయెగవేయుటమాత్రము సజ్జనలక్షణముకాదని మనవిచేయుచున్నవారము.

## కృతివిమర్శము.

లింగార్చనాబంధసీసమాలిక:— ఇది ప్రకటితమైన యొకకరపత్రము- అష్టావధాని చింబినాడ వెంకటరత్నశాస్త్రిగారిచేఁ బనుపఁబడి మా కార్యస్థాన మలంకరించినది- కవియీసీసమాలికను పుష్పమయమో రుద్రాక్షమయమో నైన కమఁ జిత్రముగఁ గూర్చినమాలికచే నలంకరింపఁబడి యాలయములయందు సుప్రతిష్ఠితమైయుండు శివలింగముయొక్క యాకృతిలో నిముడ్చిచూపటకుఁ గనులపండువుగ నొనరించెను- మాలికయొక్క చతుఃకోణములయందలి చతురక్షరములలోను "కృష్ణకవి"యని తనపేరును, లింగాధిష్ఠితమగు గద్దెయొక్క చతుఃకోణములయందలిచతురక్షరములు, అభిషేకోదకము క్రిందికిఁబను నాకారములోనియొకయక్షరము, లింగాగ్రము రెండుకోణముల రెండక్షరములు, వెరసి యేడక్షరములలోను "భాగవతులవారు" అని తనయింటిపేరును, లింగాగ్రమునుండిపీఠమూలమువఱకుగల మధ్యాక్షరములలో 'శ్రీమజ్జనకుఁడగు రఘునాథబుధుని యానతిదేవీస్తవము" అని తనచికీర్షితమును, మాలికలో నక్కడక్కడ మణులవలెఁ గూర్చిన యాఱక్షరములలో "శ్రీరామలక్ష్మాంబ" అని తనతల్లిపేరును, నిమిడ్చి కవి తనచాతురినంతయుఁ బాఠకలోకమునకు వెల్లడించియున్నవాఁడు, ఈపత్రము వలయువారు పై వెంకటరత్నశాస్త్రిగారి పేరనే బెజవాడకు వ్రాసిన నుచితముగాఁ బడయఁగలరు.

# సుకవిరిపుకపోలచపేటము.



ఇంచుమించు నాలుగుసంవత్సరములనుండి శ్రీ తిరుపతివేంకటేశ్వరకవులమీఁదికిఁ గొందఱు పండితంమన్యు లొంటికాలిపైన లేచుచున్నారు, అం దగ్రతాంబూలపువారు గిరితకారయితలు, తరువాత వారు గుంటూరుసీమలోని కథానాయకులు, అటుపిమ్మట వారు పైవారల ననుకరించువారును, అట్లు కా. మఱికొందఱు నని యెల్లరెఱింగిన విషయమేకదా. శ్రీ కవివరులపైఁ పుం మన్యులు కాలుద్రవ్వుటను గుఱించి పూర్వ మెప్పుడో తాతలకాలమునఁ జేసిన వీరిదిగ్విజయసమయమున నంతపాటివా రెవ్వరు లేమిచే నెట్టో కనులుమూసి గంతకట్టి యశముపడసిరనియు నిపు డెందఱో మహానుభావులువిలసిల్లుటచే వీరి యాట లెంతమాత్రమును సాఁగి రాకున్నవనియుఁ గొంద ఱభిప్రాయపడుచున్నారు కాని ప్రకృతపు మన మన్యులవలె శ్రీ కవివరుల దిగ్విజయసమయమునందలి పండితశౌండులు స్వశక్తినెఱుంగక "యేన కేనాప్యుపాయేన ప్రసిద్ధఃపురుషోభవే" త్తను శ్లోకప్రమాణానుయాయి మండలిలో గణింపఁబడి బుధజనపరిహాసయోగ్యత నిచ్ఛగింపక గౌరవపరిరక్షణము గావించికొనినసంగతి వారు(పైవిధముగ నభిప్రాయపడువారు) గమనింపలేకపోవుట శోచనీయమని వ్రాయవలసివచ్చినందునకుఁ గష్టముతోఁచుచున్నది, లోకమునఁ గలహప్రసక్తి తారసిల్లెనేని నొకరిపైన మఱియొకరు కాలుద్రవ్వుట యెదిరికన్నఁ దా నెక్కుడుసమర్థుఁడై యుండుటవలనను, ఎట్లైనగానిమ్మని యన్నిటికిఁ దెగించియుండుటవలనను నిరూపింపవచ్చును. అందు శ్రీ కవివరులమీఁదికి మన్యులే తెంచుట రెండవవిధముగఁ బరిగణించుట కావంతయు శంకింపఁ బనిలేదు. శ్రీ

కవివరులవలని పరాభవము నైతము గ్రంథస్థమై శ్రేయోదాయకమగుటంబట్టి మచ్చుల కొన్నిచూపినను లోటుగలుగదు, భవతునాము, ఇప్పుడు నేను శ్రీ కవివరులతో డుబ్బుచ్చులంగొన్ని వందలఁగూర్చి వ్రాయగడంగలేదు, అందులకు శ్రీ కవివరులును మఱికొందఱు సమదర్శనులును న్యాయరీతిని గార్యము నిర్వహించుచునే యున్నారు. ప్రస్తుత మీయుపోద్ఘాత మింతటితోనిలిపి ముఖ్యముగ నిపుడు వ్రాయఁబూనినదాని కుపక్రమింతము, రామాయణములోఁ గిఱుకలవ్రేల్లాట, యనినట్లీనడుమఁ "బాలిశగృహీతాశ్రవణానంద శృంఖల"యని నూతనముగ నొక విమర్శనగ్రంథరాజము బయలుదేఱినది. అయ్యది యొకమిత్రుని యొద్దనుండఁగ నందలివిషయములఁ జూచితిని. ఇక్కాలమున నుదయించు విమర్శనగ్రంథశిలీంధ్రములలో మూఁడువంతులు పరస్పరక్రోధగర్జితములవలననే యుత్పత్తిల్లుచున్నవి, దశానామేకాదశ, అనినట్లు వానిలో నిదియు నొకటియే కాని "నిష్పక్షపాతముగ వ్రాయఁబడిన"దని గ్రంథకర్త లెంతప్రకటింపించినను "నిష్పక్షపాతబుద్ధితో వ్రాయఁబడినదానను కాను మొఱ్ఱో"యని యాగ్రంథమే ఘోషించుచున్నది. ఎప్పటికిని విమృష్టుని కన్న విమర్శకుఁ డధికప్రజ్ఞాశాలియై తాను నిర్దుష్టముగ వ్రాయఁగలిగి యన్యుల విమర్శించిన మేలగును గాని శృంఖలకర్తలవతారికలో "నేను తిరుపతివేంకటకవుల కవిత్వములోఁ దప్పులువట్టినను నాకవిత్వములోఁగూడఁ దప్పులుండకపో"వని వ్రాసికొనినట్లు తప్పుడువ్రాఁతలతోఁ దప్పులు చూపినఁ బ్రాజ్ఞలోకము విశ్వసింపదు. విమృష్టునికన్న విమర్శకుఁ డధికుఁడుగాకున్నను "నిజములగు తప్పులఁజూపిన నవి తప్పులుగాకుండునా"యని ప్రశ్నింపవత్తురేమో, పాప మావృథాశ్రమ వీరికెందులకు? శ్రీ కవివరులచేతనె "ప్రమాదాదిపతితదోషము

ఉన్నచో సవరించికొనుఁ"డని తత్తద్గ్రంథపీఠికలలోనే సవినయముగ సూచింపఁబడి పాఠకవరులు జాగరూకతతోనే పఠించుకొనుచున్నారు కావున నాచదువరులకన్న నిశ్శృంఖలాకర్త విశేషమేమున్నది? ఒకవేళ శ్రీకవివరులకన్న శృంఖలాకర్తలధికులే యందురేని నాయాధిక్యమునుగూర్చి యెల్లలోకమునకువలెనే వారి (శృంఖలకర్తల) హృదయమునకును గట్టిగ తెలియును. మఱియు నిశ్శృంఖలాకారులు తమ యీ మహాగ్రంథభూమికలో, పైవిధమున వ్రాయుటఁజూడఁ గాళిదాసుఁడు "క్వసూర్యప్రభవోవంశః॥ మందః కవియశః ప్రార్థీ"యను శ్లోకములను జెప్పికొనినట్లు తమరును గర్వనిరాసకముగ నట్లుచెప్పికొనిరని తోఁచెడిని, చదువరులారా! మీకొకవిజ్ఞప్తి, ఏమన "కాళిదాసకవితాశృంఖల" ఇది నాచేఁ జేయఁబడిన యొకవిమర్శనగ్రంథము. అందలివిషయము నిచ్చట మచ్చున కిచ్చుచున్నాను, కుమారసంభవము॥ సర్గ॥3॥ శ్లో॥44॥ త్రియంబకంసంయమినందదర్శ॥ అనియున్నది. ఇచ్చట త్రియంబకం, అనుచోట యణాదేశమేకాని. ఇయఙాదేశము రాదు, కవిజీవించియుండినచో నికోయణచి సూత్రార్థముఁ జక్కఁగ బోధించియుండును. గాని యది ఘటింపలేదు. అయినదానికి వగచి ప్రయోజనమేమి? ఈ యపాణినీయప్రయోగమును గాళిదాసపక్షపాతియగు మల్లినాథుఁడు "త్రియంబకమితి పాద్మపురాణార్థోయం, అయ మియఙాదేశ"యనియు సోపి మహాకవిప్రయోగాత్తథాంగీకృత, యనియు నెట్లో శ్రమపడి వ్యాఖ్యానమున సమర్థించెనుగాని యది యెంతమాత్రము పొసఁగదు కావున నిది శుద్ధతప్పు, త్ర్యంబకమ్మని పండితులు విద్యార్థులకు దిద్ది చెప్పునది, ఛందోభంగమైన నగుఁగాక. ఈనాగరికకాలమున మన మా ఛాందసము నంతగాఁ బాటింపవలసిన పనిలేదు. అంతగాఁ గాదు కూడ

దనువారు, త్రిలోచనం అని పాఠాంతరము గల్పించుకొనవలయును, ఇట్టితప్పులు కుప్పతెప్పలు, దిఙ్మాత్రముగా నిది చూపఁబడినది. ఇంకను రసభంగాదిదోషములు కలవు గాని వ్యాసవిస్తరభీతిచే నిట నుదాహరింపమానితిమి (నా కాళిదాసకవితాశృంఖలాపీఠికలోని వచనము) నేను కాళిదాసకవిత్వములోఁ దప్పులుపట్టినను నాకైఁతలో సైతము తప్పులుండును, ఇంకొకమనవి, స్వపరశక్తితారతమ్య మెఱుంగని విమర్శకులు బయలుదేఱినప్పు డవసరమునితోఁచెనేని నా కాళిదాసకవితాశృంఖలలోని రత్నమొకటి వాల్పఁబడుచుండును. ఇదియొక యముద్రిత బుద్ధిస్థగ్రంథసాగరము. వలయునా రిట్టిసమయమున నప్రమత్తతతో వార్తాపత్రికలు వెదకికొనుసది కావున నోమహాశయులారా! యిట్టి వెఱ్ఱిమొఱ్ఱివిమర్శనములవలన నొక గ్రుడ్డిగవ్వయేని లాభమున్న దేమో యోచింపుఁడు, పైవిధమున శ్రీ మహాకవివతంసుఁడగు కాళిదాసుని గూర్చి వ్రాయవలసివచ్చినందులకు నమ్మహనీయుని హృదయమున భావించి యిప్పటికిప్పుడే వందనశతము లర్పించి దురితదూరుఁడనగుచున్నాను. ఒకపక్షమునఁ జూచిన శ్రీకవివరు లచ్చుతప్పులున్నగు స్వల్పదోషము లంతగాఁ బాటింపక జారవిడుచుటయు లోకోపకారము గనే పరిణమించుచున్న దనవచ్చును. ఏలయనఁ దన్మూలమున నెవ్వరేని బనిలేనినాపితునిఁ బోనివారు వానినన్నిటి నొకవిమర్శనగ్రంథముగఁగూర్చి శ్రీకవివరుల వాసిచేతనైనఁ గొన్నిపొత్తముల నమ్మికొని పొట్ట పోసికొందురు. మఱియు నాకు లోకోపకారమున కింతగఁ బాటుపడి వ్రాసిన శృంఖలలోఁ దత్కర్త లెంత తెలివితేటలఁ గనపఱిచిరో యొకింతపట్టిచూతమనుతలంపు వొడమియు సందునకు సుదర్శనపత్త్రిక యింతకుమున్నే పూనికొనియుండుటంబట్టియు శ్రీకవివరులు తృణీకరింపఁ

బోవుచుండుటం బట్టియు మీఁదమీఁద ననగత్యమనితోఁచినది, శ్రీ కవివరుల యొప్పులను దప్పులుగా భ్రాంతిపడి కొన్నింటిని, ఒప్పులని యెఱింగియు నపారపాండిత్య వైదగ్ధ్యముచేఁ దప్పులుగా సాధింపఁబూని కొన్నిటిని "ప్రమాదో ధీమతామపి" యని యుండుట బట్టి ప్రమాదపతితములఁ గొన్నిటిని సేకరించి విమర్శకాగ్రగణ్య బిరుదము సంపాదింపఁ బాతరలాడుచున్న ప్రస్తుతవిమర్శకుఁడుగారు, వెక్కిరింపఁబోయిన మూతివంకరబోయె నను సామెతకుఁ దార్కాణమైరనుటకు విచారముగ నున్నది. పగఁటిమిగలవానికి లక్షణ మొరులకు వంకలిడుటగాదు. వారికన్న మిన్నగఁ గార్యము నిర్వర్తించి లోకమునకుఁజూపినఁ జాలును. అప్పట్లు వారును వీరి ననుసరింపకతప్పదు, ఇంతకు నధిక్షేపగ్రథిత కంకణులకుఁ గార్యనిర్వాహణమన్నఁ గంఠముమీఁది గాండీవముగాని వేఱొండుగాదు. నల్లనిసులోచనములవానికిఁ బ్రపంచమంతయు నల్లగనే కాన్పించినపగిది రోషాన్వేషణాయత్తచిత్తునకు దుష్టాదుష్టములు రెండును భ్రష్టముగఁగాన్పించుట స్వతస్సిద్ధము. శ్రీ కవివరులమీఁద ననూయచే ననేకవిధములఁ గాలుద్రవ్వువారలకందఱ కుపయోగ మేమేనిఁ గలదని వారియభిప్రాయమేమో కాని లోకోపకారకారకములగు గ్రంథము లింక నెన్నియేని రచింపవలసిన పరిపూర్ణభారము శిరమందు గల శ్రీ మహాకవివరులనఁదగిన తిరుపతి వేంకటేశ్వరుల ననవసరములగు పేలపిండిప్రశ్నలకు సమాధానమిచ్చుటలో ననర్ఘమగు వారికాలమును వృథాయాపనముఁ జేయక విధిలేనివారిగఁ జేయుచు లోకోపకారమున కాటంకపఱిచిన ఘోరపాతకముమాత్ర మీకాలుద్రవ్వువారలకు జన్మజన్మమునకు వెంటఁబడి వేధింపకమానదు. ఇది ముమ్మాటికిని నిక్కము. మనయాంధ్రభాష కిప్పుడు శ్రీ కవివరులు పెట్టినది భిక్షగ నున్నది; ప్రకృతము నూటికిఁ దొంబదిమంది వారిగ్రంథపఠనమువలనను వారిని మార్గప్రదర్శకులుగ నుంచికొనుటవలనను దమపాండిత్యమునకు వన్నె వెట్టికొనుచున్నారనుట నిర్వివాదాంశము. ఇట్లు వ్రాయుటచే

శ్రీ కవివరులు మాకేదియుఁ ద్రవ్వితల కెత్తునదిలేదు. మాకుఁగల న్యాయపక్షపాతమే యిట్లు వ్రాయించినది కాని మఱియొకరి ప్రోత్సాహమును లేదు ఒక విద్యావిషయక ప్రసంగము వచ్చినప్పుడు దక్క నన్నిట మా ఉభయులు సమానగౌరవపాత్రులే. నా రొరిగించినదియు లేదు నీ రొరిగింపనిదియు లేదు. ఉభయులును మిత్రతాపాత్రులే. ఇట్లు నిష్పక్షపాతముగ వ్రాయుటవలన, యథార్థవాదీ బంధువిరోధీ, యనుట నిక్కమే యైనను సత్యముఁ జెప్పుటలో మాత్రము సాహసింపకమానము. వ్యతిరేకులు కినిసిన లాభము లేదు. ఇఁక నీవిషయ మెంత వ్రాసిన నింతియే, గోడగడుగుట వంటిదిగనున్న ప్రస్తుతపు మన వృథామత్సరగ్రస్తుల చారిత్ర మెంత వ్రాసినను లేఖకులకు విసుపుపుట్టవలసినదే కాని యొకప్పటికినిఁ దుదముట్టునట్లు తోఁపదు. కనుక నిఁక నొకపద్దెమును మాత్రము వ్రాసి మా లేఖిని కొకింత విశ్రాంతి గలిగింతము.

సీ॥ భట్టవర్యులలోన దిట్టయౌ నన్నయ
భట్టారకున కాదిఁ బుట్టువొంది
చాళుక్యవంశసంజనితుఁడౌ రాజేంద్రు
తోరంపుముంగిట దోఁగియాడి
అలకృష్ణదేవరాయలవారిసభలోనఁ
దళధింధిమంచు నృత్యంబొనర్చి
తంజాపురీశు నాస్థానమంటపమందు
మంతుకెక్కఁగఁ జాల రంతుసల్పి
తే॥ గీ॥ ఇపుడు కింకవిదంతిమృగేంద్రులైన
సరస తిరుపతివేంకటేశ్వరులయింటఁ
బీఁటవెట్టుకకూర్చుండెఁ, బృథులహావ
భావరస పేటి సత్కవితావధూటి.

సికింద్రాబాదు
**8--7--1913**

ఇట్లు,
చివుకుల వేంకటాచలశాస్త్రి.

శ్రీసోమేశ్వరాయనమః

స్వర్ణకారవ్యవహారము— ప్రథమభాగము.



శ్లో॥ రాజానో ర్థపరాయణాః కపటినో, విప్రా వికర్మస్థితాః
భార్యా భర్తృషు బద్ధవైరనిరతాః, పుత్రాః పితృద్వేషిణః
నిస్సారం పృథివీ నిరౌషధిలతా, నీచా మహత్త్వంగతాః
ఇత్యేవం సముపస్థితే కలియుగే ధర్మో వనాంతంగతః (ఆర్యోక్తి)

ఉ॥ *అంతయు నొక్కటే, సుఖియు, నంతయు సీసువ రానతాపతే
వింత ప్రపంచ నాటకము వేయఁగఁబడ్డది యంతెకాని యా
వంతయుఁ గాన నాదుభిద మాత్మవిచారణ చేసి చూడఁగా
నింతటిదాని కేలొ మన కెక్కువతక్కువ లంచుఁ జోరుటల్ ॥ 1

ఉ॥ నాటక వేషధారులను నాటకకర్త విధించినట్టి యా
బాటనె వేస్కొనుచుండుటది పథ్యము, జానకి వేషమూనుచున్
దాటక చేదముల్ సలిపి తజ్ఞుల సంతస పెట్టుచుంట యె
చ్చోటను జూచియుండను వసుంధరలోపల నెన్నఁడేనియున్ ॥ 2

ఉ॥ వేషము నిర్ణయించి యటు వెన్కను దానికి నుండఁదగ్గ వా
భాషలు భూషలున్ మొదలు ప్రాజ్ఞులు చెప్పిరి యంతెకాని యా
భూషణ భాషణంబులనె పూర్వము చెప్పి తదర్హమౌనటుల్
వేషము వేయనెంచుట విన్నదికన్నది కాద యెందునేన్ ॥ 3

ఉ॥ ఇత్తెఱఁ గాది వర్ణభిద యేర్పడి యూపయి వర్తనంబు లు
త్పత్తిని జెందియుండుటది తథ్యముగాఁగను, బ్రస్తుతంబునన్

---

* శ్లో॥ మృత్పిండ ఏకో బహుభాండరూప స్సువర్ణ మేకం బహుభూషణాని
గోక్షీర మేకం బహుధేనుజాత మేకః పరాత్మా బహుదేహవర్తీ
(ఇత్యభియుక్తాః)

(1) వృత్తులుముందుపుట్టి యటువెన్క ను జాతులుపుట్టినట్లుగాఁ
బాత్రములన్ లిఖంచుటకుఁబూనిరి బుద్ధిమదగ్ర్యులెందఱో॥ 4

క॥ 2మనుధర్మశాస్త్రవాక్యము జనులకు విశ్వాస్యమంట, సత్యమఁటయుహీ
తనధర్మశాస్త్రవాక్యమె కనుఁడాంధ్రచరిత్ర కారు ఘనమగునుక్తిన్

ఉ॥ ఇంతియెకాక వర్ణభిదలేలయటంచు వివాదసల్పుచున్
బంతములీఁడఁ బంచములఁ బంక్తినినుంచి భుజించుచుండి రీ
యంతకమేమనందుఁ "గలియైదుసహస్రములేగుమీఁద నా
నంతయువర్ణసంకర" మటన్నది నిశ్చయమైకనంబడెన్॥ 5

ఉ॥ ఇట్టివిపెక్కులున్న నవియెందుకుత్రవ్వగఁ నేనుఁ వ్రాయను
న్నట్టిచరిత్రకున్ వలయునంతయెకాని లెనాకు*సీమహా

---

(1) హిందూదేశకథాసంగ్రహము, ప్రథమభాగము ౬౧ పుట

బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులను నాలుగుజాతులీకాలమునందే యేర్పడినవి వేదమంత్రములరచించినఋషులసంతతివారును వేదాధ్యయనముచేసి యజ్ఞయాగాది క్రతువులుచేయువారును, జేయించువారును, అరణ్యములలోనివసించి పరతత్వవిచారముచేయువారును బ్రాహ్మణులయిరి. దస్యులు మొదలగుశత్రువులదండించి రాజ్యములుస్థాపించినవారు క్షత్రియులయిరి. వ్యవసాయము మొదలైనవృత్తులలోనున్నవారును, వాణిజ్యముచేయువారును నగు నితరార్యులందఱును వైశ్యులైరి. ఆర్యులవలనోడఁబడిన యనార్యులందఱును శూద్రులుగానెంచఁబడిరి, ఇట్లు మొట్టమొదట గుణకర్మములననుసరించి వర్ణవిభేదమేర్పడినది.

2 ఆంధ్రులచరిత్రము, ప్రథమభాగము ౧౪౬-౧౪౭ పుటలు.

...వృత్తులనుబట్టి కులభేదములేర్పడినవిగాని కులభేదములనుబట్టి వృత్తులేర్పడియుండలేదు.... మనుస్మృతియందుఁజెప్పఁబడిన భేదకారణములు కేవలము కల్పితములుగాని స్వాభావికములుగావు గనుక నవి యెంతమాత్రము విశ్వసింపఁదగినవికావు.

* శ్రీప్రౌఢసరస్వతీనిరూఢము.

క॥ ప్రాచీనసదాచార స । మాచారప్రవణతనిట నరియెదసుడి వి
ద్యాచాతుర్యాబ్ధినిధీ । సాచివ్యముగాఁగ దీనిఁజదువుఁడు సదయుల్! ॥ 8

ఘట్టుల వ్రాఁతలన్నిటికిఁ దగ్గ జవాబిడఁగా నలంపుదిన్

---

చ॥ "కలిమికులాలమింపఁ" డని క్రాలెడి నానుడి నేఁడు రేఁపు ని
ట్టులముగ బట్టబైలగుచు దంబడరెం బహుభంగులం బ్రచా
రలలితి వర్ణసంకరపు రాణ ధనాధిక రాజకీయకా
శలులగు నాంధ్రవిప్రముఖజాతులనీతుల యీతి పెంపునన్॥ 4

క॥ కొందఱుమాత్రాగ్రజ్యేటు ల । మందాక్షత సంస్కృతాంధ్రమానముగన కం
దందవిధుల నచ్ఛిత్తిం । పం దలరిరి, వారికోటఁ బట్టితిఁగలమున్ 5

మ॥ స్వసదాచారము లెల్లమానికొని విప్రవ్రాత మంత్యోద్భవ దు
ష్టసమాజాంబుధిఁ బ్రుంగి శాస్త్రిముల నిచ్ఛాయుక్తిసర్థింప రా
జసమంచద్గతి యెట్లుకల్గునె సుధీసామ్రాజ్యధౌరేయతా
ప్రస్ఫూర్తింగాంచిరు గ్రాజ్యుయేట్లు,తలవోవం బాహువుల్ నిల్పునే 6

మ॥ విడోమ్యారేజుసొసైటి కాంగ్రెసును కాన్ఫరెన్సు సేసున్ సహా
సెడిషన్ బాంబుసు సీవయోజిక్కృతి నిష్సిహింపులాయర్సు హై
కెడుకేషన్ గని తేటిహమ్మాకలలం దెంతేని ద్రవ్యంబు జా
తి దుబాయించెడి చెడ్డత్రోవనిడ నేదీ ధర్మకర్మం బిటన్॥ 7

సీ॥ విధవావివాహంబు విధిబోధితంబఁట, స్త్రీవిద్య పూర్వసంభావితమఁట
ఋతుమతీసతి పెండ్లి స్మృతిచోదితంబఁట, స్త్రీస్వతంత్రత శాస్త్రసిద్ధమంట
నాయూన మాద్యులు చేయుచుండిరఁట, హూణమ్లేచ్ఛదేశాటనము తగునఁట
జాతినీతిభిద దురీతులకిక్కఁట, ఐకమత్యము దానఁ జేకురదఁట
ఇట్టిదుష్టోహ లధిపులకెఱుకపఱచి । శాసనంబులకై ఘోరసాఁగెదరఁట
బ్రాహ్మణబ్రువగ్రాజ్యుయేట్ప్రతతిలోనఁ । గొంద అస్మజ్జనుల్,వీరిగోనముగనుఁడు 8

క॥ అటువీరియభిప్రాయము । తటుకుననంగీకరింత్రైతేధర్మప్రభువు,ల
క్కటు యేమిబుద్ధియిది,వా । రటశాస్త్రజ్ఞాలఁబిలచియడుగ,రగు,బలే॥ 9

క॥ గమగచ్ఛటుగోగ్రాజ్యే । ట్లు మహాశాస్త్రజ్ఞులగతి లూలా మాలా
ఛమరింప రాజాలే వా । నిమదింగైకొందు ర్యగణింపుఁడుధీరుల్! 10

బట్టెఁ బ్రతిజ్ఞయొక్క రూఁకను "గ్రామసరస్వతి" యోగ బుధుండు వ్రాయు॥6

ఉ॥ జాతిని నీతి నేకముగ సల్పిన స్వర్ణకారులు హిందుమండలీ
ఖ్యాతిఁ బ్రవృద్ధమౌఁటె, యహా! సువర్ణము నాశ్రయించు వి
ద్యాతతి వారలున్ వరుస లంటము నొందను దాఁగ, గ్రాజ్యయే
ద్రాపితము శాస్త్రభీతి విడఁ గ్రొవ్వుమున్ సడిపింప నింపగున్॥ 20

ఉ॥ " స్త్రీలకు విద్యనీయఁ దగు స్త్రీలకు ధర్మశిక్ష గాఁదగున్
స్త్రీలకు షోడశాబ్దముఁ జేయఁదగుం గనంగ సంగ్రహంబునున్
స్త్రీలకు, బెక్కు పెండిలులు స్మృత్యుదితంబు " లటంచు దుర్మతిన్
గ్రాలిరి గ్రాజ్యయే ద్విజులు కాలవిపర్యయ మేమి చెప్పుదున్॥ 21

క॥ పేదయు బెల్లము నేకం। బై దండబడరినవిధంబు నమ్మయుఁ బెండ్లా
మోడక యొండైనకరణిఁ। బ్రోడలు గ్రాజ్యట్లుగనిరి పుంస్త్రీ విభిదల్ 22

పృథ్వి॥ స్వమాతృపితృదూషణాస్పదత ఘోరసుర గ్రాజ్యయే
ట్సమాజ మిటు సంచరించ నృపగౌరవంబింక నే
క్రమానఁగనుగొందు, రౌర యిదిగాక లేరన్న! పూ
ర్వమౌనివిధినిగ్రహోగ్రహుల కేడ జ్ఞానస్థితుల్ 25

క॥ దుర్గతినిఁ గ్రాజ్యటు ల। నర్గళతఁ గురాను బైబిలాద్యాచారో
న్మార్గతులైనఁ ద్రిశంకు। స్వర్గ మొకటవీరికింక వలయు నవనిలోన్॥ 26

ఉ॥ తాము కులాదినిష్ఠలను దర్భజలాంజలులొట్టి చాలదా
యేమిటు గ్రాజ్యయేట్లగుణ మిట్లు, పురోహితముఖ్యవిప్రులన్
వేమరుఁ గూటికింబిలచి వేడఁ ఘోమేహముభీతిఁ జూపు, వెం
రా! మతిరాజు లేక నరో భ్రష్టనవీనకృతిప్రకాండమున్ 27

ఉ॥ బొంబయి యాంధ్రపత్రిక "విభూతికరం" బని రండ సంగ్లి నా
లంబనఁ జేసి స్త్రీవిషయలంపటతం బళి! గ్రాజ్యయేటు వ్యా
సంబుల భర్తయు స్త్రీసరసంబుగ నట్టివకొన్ని యస్నేముల్
కుంబిన వేడ్క నెల్లపుడు వ్రాసెడిఁ గంటిరె, యుద్దియద్దియే 29

తే॥ మఱియు నీ నూత్నమతములమార్పు కొఱకు

---

ఉ॥ పేనిన గ్రాజ్యుయేటు లతివిస్మయచర్యలనైక్యమాటలో
కానక రాజ్యపద్ధతికిఁ గశ్మలముల్ ఘటియించునంచు దు
ర్మానవిహారభంగముగ రాజులు శాసనశక్తి శాంతి నెం
తేనొ నరింతు,రద్దియును దెల్పకిఁ దే,రిదియేమి శౌర్యమో॥ 31
శా॥ మీయుద్యోగధనాలు నిత్యములె యేమీ గ్రాజ్యుయేట్లూ! మహా
న్యాయోపాయత "జైలునందిడుదు" మంద్రా? బాఁపలన్ శ్రాద్ధజ
ధ్యాయత్తేతరులైనయంత, నివియేనా యైకమత్యస్ఫుర
ద్వ్యాయామంబులు? బోడబాఁపలను ద్రెంపంబల్కుటల్ చుల్కయే? 32
క॥ మ్యారేజాష్టరుపుల్యాబ। ట్రీ రామాయణమునిటఁ గడిందినుఁగఁటిమిన్
వేరచియించిరి మదరా। శీరస వాల్మీకిజాతిసిద్ధులు? గంద్రే? 33
క॥ తమ కెదియవసరమో శ్రుతి। సుమహితులుగ దానిఁ గొంద్రుసూ పాదముకై
గమనింపరఁడు,వేదము శా। స్త్రము నీ గ్రాజ్యేట్లు మానధనులైకంద్రే? 34
సీ॥ ఇంగ్లీషుసంస్కృత మెఱిఁగినవారలు దెలియుఁడీ గ్రాజ్యుయేటుల తెలువులు
"మ్యారింగుబుతు"వను సార్థ మొకటి వివాహకాలమునను వఱలునంట
మెక్ స్టుయియల్ డిస్చార్జిమీనింగు సంస్కృతభాషను గజనీనాఁబరఁగునంట
"చంద్రగంధర్వవైశ్వానరాంతము సతిబుత్వంత"ముని శాస్త్రతత్త్వమంట
అగ్నిసంతతి సంపదలమరినట్టి। చెలిని వరునకుఁ బెండ్లికై చేర్చునంట
ఇదియగృహ్యార్థమఁటవీర లెఱిఁగినదియ। మ్యారెజాష్టరుపుల్యాబర్ట మానమునను 35
సీ॥ విధవాబుతుమతీ వివిధవివాహాల ధర్మముగూడఁ బెట్టిరి గ్రాజ్యుయేట్లు
స్త్రీస్వతంత్రతఁ గలాభాస్వరతను సద్ధరతిజాడఁ బట్టిరి గ్రాజ్యుయేట్లు
చంద్రగంధర్వవైశ్వానరకామపుత్రతఁగూడఁ బుట్టిరి గ్రాజ్యుయేట్లు
దేశాంతరవిహారధీస్థితి స్వర్గమార్గమునూడఁగొట్టిరి గ్రాజ్యుయేట్లు
వేదశాస్త్రపురాణపలాణాది గిర్వా। శేషభాషాంతరీకరణాకలితత
లలిఁజతుర్విధపురుషార్థముఁ ధరించి। ప్రాజ్యసామ్రాజ్యపతులైరి గ్రాజ్యుయేట్లు 36
క॥ పారస్కరహరిహరముత। మెరూఢిఁజతుర్ధరాత్రిమిసునకృతికి ధీ
సార్థము విప్రులమం స। మీరితమగుకతన గ్రాజ్యుయేటులకొదవున్ 37

పత్రికాస్థాపనమె చేయఁ బాటుపడెడి

---

క॥ మానవసూత్రంబెట్టుల। మానంబగు? నేమివిధిగ మతియు మనుస్మృ
త్యానయనము ధర్మస్థితి। నూనుసు గలి, గ్రాజ్యయేదనూ నాకాంతుక్ 38
క॥ బౌధాయనముల్ సూర్యరియ। సై ధారుణి గ్రాజ్యయేట్లకలరెడి వికటా
సాధారణతత్త్వజ్ఞా। సాధారము గాఁగఁ, జూడుఁడా తత్త్వజ్ఞుల్ ! 39
చ॥ కులములు గోత్రపంక్తు లనుకూలముఁ జేయుచు లోక మెల్ల నా
కులములనార్చి "వావు"లను క్రూరపథంబులుమాపి శ్రాద్ధపీ
డలఁదొలఁగించి ధీక్షలవిడంబిత చర్యల వేద దేవశ్యం
ఖలములనూడఁగొట్టెదరు గ్రాజుయెటు ల్పరమోపకారులై 40
క॥ "సోషల్ రిఫారు"మని యిం। గ్లీషుఁజదివినట్టి విప్రకీర్తులిటం గాం
త్రైపణనదృత చర్యల। నీపల్లజ్జ నెడదనిడ నెంచ, రయారే 41
క॥ కాస్మాపొలిటన్ క్లబ్బున। బిస్మిల్లాలగుచు ధర్మవిరహితులగు వి
ప్రస్మయ యుగ్రాజ్యేటు ల। పస్మారముగొనిరి బుద్ధిబలము దలఁగఁగన్ 42
క॥ ఇట్టిసమాజంబులు బలు। పట్టుగ సమజంబులగతిబరఁగఁగ ధర్మం
బెట్టగఁ దుదముట్టక, మన। పుట్టుకలకుఁ గారణంబుఁ బొడఁగనుఁడార్యుల్ ! 43
ఉ॥ ఎవ్వఁడ నెట్లువచ్చితిని, యెచ్చటనుండి యిదేమి దృశ్యమా
లెవ్విధి నైహికంబరయ నెచ్చటికింకను నేఁగఁగావలెన్
దెవ్వదియెంత యేపథము దానినిజూపెడివార లెవ్వరం
చివ్వడువుంగనాక వృధ నేగుచునుండిరి గ్రాజ్యయేడ్విజుల్ 45
శా॥ శ్రీవిద్యాదికకర్మలంబడినవారిన్ లెక్క సేయంగ నా
రా వేలుందురు గ్రాజ్యయేణ్ముఖులు దుర్వారోగ్రసామర్థ్యసం
భావస్థైర్యత, నేనిటొక్కఁడను, నావారెవ్వరేనుందురో
నావాదంబును నిల్వఁద్రొక్కుటకు శ్రీనారాయణుండేనొకా? 46
ఉ॥ ఒక్కఁడనంచు నేభయమునొందను, భూమికి నాథుఁ డొక్కఁడే
మెక్కుఁడు గారు, దద్విధిగ విశ్వసృజిస్థితి నాశుఁ డొక్కఁడే
నిక్కము, సత్యపద్ధతికి నెమ్మి సహాయము దేల, బేలలై
తికృతనాననన్నటులఁ దెల్వినిబూనిరి గ్రాజ్యయేద్విజుల్ 47

ప్రాజ్ఞులైనట్టి మల్లాది రామకృష్ణ

ఉ॥ "ఇక్కవితాచమత్కృతుల నీశ్వరసంస్తుతిభవ్యకావ్యమం
దక్కట వేదదేవవిషయామలభక్తిగ నేర్చి పూర్వరా
దొక్కో"యటంచుఁ గొందఱు మనోంబుజముల్ గమలింత్రు కాంత్రై,నా
కెన్నఁడు వేదశాస్త్రమతమే స్థిరమాటను దీనినానితిన్ 48

సీ॥ వేదశాస్త్రపురాణవిహితాచరణలేక ధర్మంబుగాదు నే కర్మతునకు
విద్యావినయనయవృతనృపత్వములేక యర్థంబువొసఁగు నే వ్యర్థగతికి
రూపయౌవనధనరూఢాంగములులేక కామ మొప్పారు నే పామరునకు
పరసాధనచతుష్టయసంపదలులేక మోక్షంబుదొరకు నే రూక్షమతికి
వీనిలోపల నాద్యంతమూనలేక మధ్యమునఁజిక్కియేడ్తు రమేధ్యభుజాలు
గ్రాజ్యుయేట్పదవులె శాశ్వతేజ్యములుగ నైకమత్యార్థతత్వంబు నరయలేక 49

శా॥ తత్వజ్ఞానముఁబొంటె ధర్మములసంధన్ గ్రాజ్యుయేట్ఛ్రిద్ధభో
క్తృత్వాదిన్ విడిపింప సంఘమున నర్థింబల్కి యనోన్యచో
రత్వప్రక్రియఁగూళ్లకేగిరఁట, యౌరా "బ్రాహ్మణానామనే
కత్వ"న్యాయము సార్థకంపడఁగ నిక్కర్న్యాలుదుర్వ్యాజముల్ 50

క॥ వేదగురునృపాచార స్మృమాదరణములేనివారి కలరు నెమానం
బేదాటినైనఁ బ్రాహ్మ, ర్వ్యాదాతిక్రమణతగు నె గ్రాజ్యేటులకున్ 52

క॥ బంధురధీసింధువు లను, బంధాంతము గాఁగ దీని పరమార్థము పు
ష్పంధయసమసంధ సురసృముం ధరియింపఁజదివి గొనమునాగనుగొనుఁడీ 54

క॥ మొదలితిరా గ్రాజ్యేట్లుగఁ బొదలితిరాజాతినీతిఁ బూర్ణము సేయన్
బ్రిదిలితిరా మాటమునుం,డి దయామయులార! కరుణనిల్పుఁడు మాపైన్ 55

శా॥ గ్రాజ్యేట్లట్టులసంస్కృతోద్ధతిని నగ్రత్వంబునూనంగ ము
త్పాప్రిజ్యత్వంబువహింతురేని తమశాస్త్రార్థంబు మాతోడ వి
ద్వజ్యేష్ఠత్వముఁబొంటె సల్పుటకు నిల్వన్ రండు మీమీపదా
గజ్యోత్స్నల్ దశదిక్కులంబఱప, వ్యర్థప్రజ్ఞ లిక్లేటికిన్ 56

## సోమయాజులు గుంటూరుసీమయందు. 8

---

సీ॥ సంస్కృతశాస్త్రవచఃప్రౌఢిఁ బ్రౌఢసరస్వతీపదవి దగ్గఁగను గని
యార్యసమాజి దయానందు వాదాన నుంకించ సద్యఃకోయుక్తిని మని
బ్రహ్మవిద్యాపత్రపతివిజృంభణము నల్లనఁ జల్లపఱచెదురాగను గొని
కోమటిముసల్‌భక్తకోలాహలము వైదికాచారవిషయ్యాన నార్పఁగఁజని
వేదశాస్త్రపురాణవివాదగరిమ మఱి ధియాసఫిగబ్రహ్మసమాజగులను
జఱచి శ్రీకుమారస్వామిశాస్త్రియనఁగ నిట నలంపురి ధర్మకర్మహానిలతు 57

శా॥ ఇంగ్లీ షర్వము దెన్న సంస్కృతము నా హిందీమరాటుల్ గణిం
పం గ్లానింబడి తేటి సద్గురుకృపామాత్రాశ్రయైకాప్తి నే
నాంగ్లో సాక్సను లాటినుల్ స్వమహిమోద్యచ్ఛక్తి సాధించి పే
ర్మిం గ్లౌసామ్యము నుర్వి విప్రకులవార్ధింగంటి, నట్టి వింటిరే 58

శా॥ టీగ్రాజ్యేటులఁజూచి కోమటులు నట్లే కంసలుల్ రెడ్లు గ్రా
మగ్రీవుల్ మఱి సాలెజాండ్రలును నెవ్వారెవ్వరో వేదము
ష్టిగ్రాహంబున నౌర బ్రాహ్మణులకంటెన్ దొడ్డవారౌట్లకై
వ్యగ్రోత్సాహతనోటు దుశ్చరణకృత్యంబుల్ ప్రపంచింతురౌ 59

క॥ ఈవాదముఖండించుటకై విమఁడీభారతమునఁగా దిఁక నింగ్లం
డో వేల్సో పోవఁయుచు, గావున సన్మార్గమరయు గ్రాజ్యేణిమిత్రా! 51

మ॥ ఇది మీబోధకవ్రాసినాఁడనుడీ యేగ్రాజుయేట్లూ! గుణా
స్పదులై యింతట సంఘసంస్కరణలంజాలించి సద్బుద్ధి శా
చదయామైత్రులఁ జిత్తమందు సుకృతిన్ సాధింపఁగీలించి భూ
విదితంబై తగు వేదశాస్త్రమతమున్ విద్వద్గతిం గాంచుఁడీ 52

క॥ మంగళములు గ్రాజ్యేటులకుం గలుగుత మంచిశ్రోవగని పూర్వాచా
రేంగితము వెలంగ నడచుచుం గురుదేవకరుణను విశుద్ధిపడయుటకై 53

---

శ్లో॥ మ్యాకేజాష్టరుప్యాబర్ట్ ఖండనంతనువే సుధీః
శ్రీకుమారస్వామిశాస్త్రీ త్వహంప్రౌఢసరస్వతీ
అథ కథాంఽధి మవధారయంతు సుధియో యద్యేకేచన పరేజ్యాశీలలాలసాః



# శంతనరాజచరిత్ర

## ప్రథమాశ్వాసము

శా॥ శ్రీరామామణి క్రొమ్మెఱుంగు విజయశ్రీమించు శార్ఙ్గాయుధం
బారూఢేంద్రశరాసనమ్ము యలర శేషాద్రీంద్రకూటస్థలిన్
రారాజద్గతి నిష్టభక్తజనసారంగాళిఁ గారుణ్యవా
ర్ధారం బ్రోచెడి కృష్ణమేఘము మదాత్మం గొల్తు నిష్టాప్తికిన్॥ 1

శా॥ శ్రీమత్కౌస్తుభరత్నదీప మమలశ్రీవత్ససత్పీఠ ము
ద్దామోదారభుజాచతుష్టయఘన స్తంభంబు నాభీసరం
బామోదస్థితిఁ గాంచినట్టి హరిలీలావాసమందొప్పు హే
లావాద్యద్రుచిరాంతరంగ నలమేల్మంగం బ్రశంసించెదన్॥ 2

చ॥ ధరణిధరంబునం బొడమి తత్కఠినస్థితిలీల సత్పయో
ధరములఁ బూని పుట్టిఁలు దంభము తెల్పక తెల్పెదా బళీ
గిరివరకన్యరో ! యనుచుఁ గేరుచు వాగ్రచనాచమత్కృతిన్
సరసములాడు శంకరుఁడు శబ్దవిశేషము లిచ్చుఁగావుతన్॥ 3

సీ॥ ఏతల్లికి సుధాబ్ధిజాత తామరసజాత
శీతాంశువదనలు చెలిమికత్తె
లేనావకుఁ గదంబచారుకాంతారముల్
రమ్యతరప్రియారామపంక్తు

లీలతో తన్వికి బాలేందుబింబంబు
పోలుపొందు సీమంతభూషణంబు
లీలశుకాంగికిఁ గైలాసపర్వత
కందరంబులు కేళిమందిరంబు
గీ॥ లీలలోదరి భూరిదాతృత్వమహిమ
యతులితాఖండభోగమోక్షాప్తిహేతు
వమ్మహాదేవి నిత్యకల్యాణి గౌరి
మమ్ము నిరతంబు శుభలీల మనుచుఁగాత॥ 4

ఉ॥ "శారద! నెత్తమాడుదమె ? చక్కెరమోవులుపందె" మంచు హే
లారసరూఢినాడి మిగులం బ్రియగెల్చినయోగపద్యలీ
లారచితోరుచుంబనకళాద్భుతచాతురిపూనినట్టి యా
వారిజగర్భుఁడిచ్చు ననివారణ మాకుఁ జిరాయురున్నతుల్॥ 5

శా॥ కారుణ్యాంచదపాంగ నబ్జశరరాకాచంద్రకాసత్సుధా
పారావారశుభాంగ నబ్జజముఖప్రాసాదకేళీనట
త్సారస్యోదను దివ్యమోహన మహాసాహిత్యసంగీతవి
ద్యారాజత్కుచకుంభ నెంతు వినతాంతర్వాణి శ్రీవాణినిన్ 6

క॥ పాయక భక్తిన్ యుక్తి వినాయకు విఘ్నాహిరాడ్వినాయకు ఫలసం
ధాయకుఁ దలఁతుఁ గవిత్వామేయకళానిర్విరోధమేధాశక్తిన్ 7

సీ॥ భూరివిశ్వంభరాభారధూర్వహణ దీ
క్షావాప్తినెవ్వఁడుహర్షమొందె
చతురశ్శివఃప్రాజ్యసామ్రాజ్యవైభవ
స్ఫూర్తిఁజేనెవ్వఁడు పొలుపుమీఱె

కలశాబ్ధికన్యాభోఁ గమలాక్షుఁ డెవ్వని
భోగతల్పంబున, భోగ మొసఁగెదె
చిత్రభాసిషావిశేషభాషాద్భుత
ప్రౌఢిమ నెవ్వఁడు రహింపహించె॥

నెవ్వఁడలరారెదరహారహీరకాంతి।నమ్రహాదాంతుసకలవిద్యానిశాంతు
మహితసుస్వాంతుశ్రీమంతుబహుళశాంతు।సంతతజ్ఞానవంతునంతునెంతు

ఉ॥ శ్రీయువతీమనోధవు నశేషవిశేషగుణాభిరాము సు
శ్రీయుతసత్వముల్ వెలుఁగ సేవక కేతన పత్రలీలలన్
చాయనిభక్తిఁగొల్చు నిరపాయుని దక్షితకాద్రవేయునిన్
గేయ మొనర్తున్ ధర్మధరనిర్మలకాయుని వైనతేయునిన్॥ 9

సీ॥ హిమధామ మల్లికాసుమ భీమహీరాహి
తారావదాత సుందరము దరము
కోటిచండమయూఖగురుమయూఖోగ్ర సు
దర్శనంబైన సుదర్శనంబు
నిజభజనాజస్రనిర్మలసజ్జనా
నూనఫలప్రదమైన గదయు
విక్రమక్రమకళావక్రశక్రాది శ
రాసనంబైన శరాసనంబు

దివ్యశతకోటిశతకోటితీవ్రశాత।విమతజనకంఠలుంఠనవిష్ణుదేవు
నవమనోనందకంబగునందకంబు।మత్కవిత్వాంతరాయముల్ మాన్పఁగాత॥

క॥ నరవిసుర్రాక్రూరపరా।శరరుక్మాంగదవసిష్ఠశౌనకశుకని
ర్ఝరిణీభవకపిలమరు।ద్వరసుతులాదియగు భాగవతులఁదలఁతున్

మ॥ వినుతుల్ చేసెద సంస్కృతాంధ్రకవులన్ విఖ్యాతవాల్మీకి వ్యా
సుని బాణున్ భవభూతి మల్హణుని భోజుం గాళిదాసున్ మయూ
రుని దండిన్ శివభద్రు భారతిని జోరున్ నన్నయం దిక్కనా
ఖ్యుని శ్రీనాథుని సోము భీము నమరార్యుం బెద్దనం బోతనన్॥ 12

క॥ పంకజలోచనలీలా। సంకలితరసత్ప్రబంధసంధానని రా
తంకుమదగ్రహితామహిమా। వేంకటకవిచంద్రుహృదయవీధిఁ దలంతున్

క॥ కప్పురముగుప్పుగుప్పున। గుప్పినక్రియ సంకుమదముకుంకుమనొకచోఁ
గుప్పలువోసినక్రియసభ। మెప్పొగఘుమ్మనుచుఁగవిత మెఱయఁగవలదా॥

వలపించుచుశృంగారము। చిలుకుచుహృదయమునుగఱఁగ జేయుచునోహో
వెలవెలఁదిలీలఁ గావ్యమువిలసిల్లఁగవలదె సుకవివీరులుమెచ్చన్॥ 15

క॥ సరసులమంచని విద్వ। త్సరసోక్తుల నెరసు లేఱి సారెకుఁ గుకవుల్
మెఱయుదురీఁగలుగంధపుఁ। బరిమళముల్విడిచి వ్రణముపరికించుక్రియన్॥

ఉ॥ పెట్టెదమీఁకుదండములు ప్రేలకయుండినఁ, బ్రేలినంతనే
మొట్టెదశీర్షభాగమున. మూషకవీశ్వరులార! గట్టిగాఁ
దిట్టుదుఁ గాఁక కూటవిషతీవ్రపటిష్ఠవిసిష్ఠరోక్తులన్
గట్టునుబొమ్మ ముద్రచిత్రకావ్యములో నెరసుల్ గణించినన్॥ 17

వ॥ అని యిష్టదేవతాప్రార్థనాచరణంబును గురుచరణస్మర
ణంబును బురాతనసుకవీంద్రసముచ్చరణంబును దుష్టకవిజనతృణీకర
ణంబును గావించి సార్వకాలభవ్యంబును విద్వద్వతంససంభావ్యంబును
సుకవిసార్వభౌమశ్రావ్యంబును నత్యంతదివ్యంబు నైన నొక్క కావ్యం
బనవద్యగద్యపద్యహృద్యంబై వెలయఁ గంజాతసంజాతకంజాతలోచ

నా చరణకంజగుంజన్మణిమంజుమంజీరపుంజ సింజానినాదమేనురార్భటిఁ ఘటియింపంబూనియున్న యెడ, 18

సీ॥ కందర్పశతకోటిసౌందర్యరేఖా వి
రాజితంబు సురేంద్రపూజితంబు
ధళధళోద్యత్ప్రభాకలితకౌస్తుభకంఠ
భూషణంబు గభీరభాషణంబు
పద్మాంకుశాండజపాశాదిచరణాబ్జ
లక్షణం బురుకృపావీక్షణంబు
దరచక్రశార్ఙ్గ నందకగదాయుధబాహు
ధారణంబు సమస్తకారణంబు

గరుడపత్రంబు కమనీయకనకనేత్ర।మాశ్రితోద్యానవనచైత్రమైనయట్టి
వెంకటాచలనాయకవిగ్రహంబు।దర్శనంబయ్యె నెదుటమత్స్వప్నమునను॥

వ॥ ఇత్తెఱంగున మదీయసహస్రకోటిజన్మజన్మాంతరార్జితాగణ్యపుణ్యపరిపాకంబునం బ్రత్యక్షంబైన యద్దేవతాసార్వభౌముశ్రీపాదపద్మంబులకనేకసాష్టాంగదండప్రణామంబులత్యంత వినయతాత్పర్యంబులనాచరించియానందబాష్పజలబిందుసందోహనయనారవిందుండనై లేచినిటలతటఘటితకరపుటుండనగునన్ను స శీతలసకృపాకటాక్షవీక్షణంబులనిరీక్షించి లక్ష్మీవల్లభుండు మృదుమధురసరసవచనరచనల నిట్లనియానతిచ్చె, 20

క॥ "మీవారలెల్లమత్పద।సేవాపరతంత్రహృదయశీలురుగానన్
నీవుమదీయాంకితముగఁ।గావింపుము తెనుఁగునొక్క కావ్యమునత్నా!॥ 21

వ॥ అదియెట్టిదంటేని, 22

మ॥ విపులస్వాంతుఁడు శాంతనక్షితిపుఁ డుర్వీమండలం బేలుచున్
సమతన్ స్వర్ణది యొక్క కారణమునన్ మర్త్యాంబుజాతాక్షియై
రమణుం గోరినఁ బెండ్లియాడె వెస నారాజన్యగాథాళి పం
చమవేదోక్తముఁ బోలినట్లగుటఁ దత్సందర్భభావార్థముల్
క్రమమొప్పార నెఱింగి మత్ప్రియముగాఁ గావ్యంబుగావింపుమా॥ 23

మ। లలితాంచత్పదసంగతిం దగి రసాలంకారభావోన్నతుల్
వెలయన్ శయ్యలఁ జారురీతులను ఠీవిం జెంది సద్వర్ణసం
కలనం జెందిన నీ మనోజ్ఞకవితాకన్యన్ శుభశ్రీకలా
కలితన్ వేడ్కవరింతు శాశ్వతమహాకల్యాణసంధాయినై" 24

వ॥ అని తెల్పి యంతర్ధానంబునొందె, నేను మేల్కాంచి చం
చత్కుతూహలాద్భుతాక్రాంతస్వాంతాంబుజాంతరాళుండనై యప్పు
రుషోత్తముదివ్యమంగళవిగ్రహంబు పలుమాఱు తలంచి నమస్కరింపు
చుఁ జిత్తంబున నిట్లని వితర్కించితి, 25

శా॥ "శ్రీలక్ష్మీసరసోక్తులన్ జెలఁగు రాజీవాక్షు నస్మద్వచో
లాలిత్యం బలరించునే యనుచు నేలా నే విచారింపఁగా
కేళిప్రౌఢశుకీవిలాసరసవాక్ప్రీతాత్ముఁడౌ నేలికన్
బాలత్వంబున నొప్పు చిల్కపలు కానందంబుఁ జెందింపదే॥ 26

ఉ॥ శంతనచక్రవర్తి విలసచ్చరితంబున కంబుజాలయా
కాంతుఁడు నాథుఁడౌట జిగిగల్గిన పైఁడికిఁ బారిజాతపు
ష్పాంతరసారసౌరభమహావిభవంబు భవంబు జెందిన
ట్లింతి యొకొక వేడుకలదా తలపోయఁగ నెన్నిభంగులన్" 27

వ॥ అనితలంచి మదీయాన్వయక్రమం బభివర్ణించెద, 28

—కవివంశానుక్రమణిక.—

సీ॥ సంతతనిజమిత్రశతపత్రశతపత్ర
మిత్రు లాపస్తంబసూత్రు లెన్న
బహుళసజ్జనబృందసహకారవనషండ
చైత్రు లాపస్తంబసూత్రు లెన్న
హృద్యానవద్యసద్విద్యావిలాసవై
చిత్రు లాపస్తంబసూత్రు లెన్న
ఘనయశోనిర్జితాకాశసరిత్స్రోత
గోత్రు లాపస్తంబసూత్రు లెన్న

గీ॥ వారిలోన మహోజ్వలావార్యశౌర్య
ధైర్యగాంభీర్యవీర్యచాతుర్యములను
వెలయునార్వేలవంశాబ్ధిజలజవైరి
మహితగుణపాళి కృష్ణయామాత్యమౌళి॥ 29

సీ॥ "అఘవిదూరప్రభావాభిరామతఁ గాంచి
సత్యానుకూల్యప్రశస్తి నొంది
విబుధాభిగణ్యసాత్వికవృత్తిఁ జెన్నొంది
గోత్రావనస్ఫూర్తిఁ గొమరుమిగిలి
కమనీయహలకుణాకలితలీలఁ జెలంగి
గురునందకోదారగరిమఁ గాంచి

భద్రాస్వత్తోరువైభవమునఁగన్పట్టి
యతులితానంతవిఖ్యాతిమించి॥
గీ॥ యంచితాకృతిసాక్షాత్కరించినట్టి।కృష్ణదేవుండుగాక తాఁ గేవలుండె”
యనుచుసర్వజనంబులువినుతిసేయధరణిఁగననయ్యెఁగృష్ణప్రధానవరుఁడు

క॥ అన్నమరాట్కృష్ణయబుధ।సన్నుతమతిముసలమాంబసరవివరించెన్
వెన్నుఁడుమునుకలశాంబుధికన్నియవరియించులీలగనుపట్టంగన్॥31

సీ॥ పరఁగంగవిషరాశిభవముగాంచని లక్ష్మి
చండికాఖ్యదాలంగు శంభురాణి
శక్తి గర్భమునఁగాంచనియరుంధతి పుణ్య
జనవైరులను వేడ్కఁగనని యగిరి
శివధర్మభంగహేతువుఁజెందని మహీజ
పాకారి భర్తఁగాఁబడయని శచి
దోషాకరప్రాప్తిఁదోలఁగిన రోహిణి
విషమగోత్రస్థితివెలయని ధర 31
కాకసామాన్యసాధ్వియేగణుతిసేయ।కృష్ణయామాత్యరామసత్కీర్తిధామ
భూరిముఖకాంతివిజితసంపూర్ణసోమ।రసికనుతసద్గుణకదంబ ముసలమాంబ॥

క॥ వారల కుదయించె మహో।దారగుణాధారుఁ డతులధర్మవిచారుం
డారూఢిఁజెన్నయాఖ్యుఁడు।శౌరికి రుక్మిణికిఁ బంచశరునివిభాతిన్॥ 33

ఉ॥ శ్రీనిధియై ప్రకాశమునఁ జెల్వగు చెన్నయమంత్రి సత్కృపా
మానితశౌర్యసత్యసుకుమారయశఃక్షమ లార మాధవున్
వానిమఱంది వానిగురు వానికుమారుని వానియగ్రజున్
వానియనుంగుబావ నని వారణలీల హసించెఁ జిత్రతన్॥ 34

శ్రీమత్పరదేవతాయైనమః.

# ఉపోద్ఘాతము



చదువరులారా?

ప్రకృత గ్రంథమగు నిందుమతీపరిణయమును సుప్రసిద్ధుఁడగు కుమారధూర్జటియను కవివరుఁడు విరచించెను. ఈతనింగూర్చి కాల నిర్ణయముసేయుచో మ॥ రా॥ రా॥ రావుబహదూరు కందుకూరి వీరేశలింగంపంతులవారు,

("1560, 70, సంవత్సరములవఱకును జీవించియుండునని యూహింపవలసియున్నది")

అని కవుల చరిత్రములో వ్రాసియున్నారు. వారి వ్రాఁతకాధారము శ్రీకృష్ణదేవరాయల యాస్థానకవియగు ధూర్జటికీకవి పౌత్రుఁడనునదియే యని వారిధోరణి తెల్పుచున్నది. కుమారధూర్జటి—

చ॥ స్తుతమతియైన యంధ్రకవి ధూర్జటి పల్కులకేట్లు గల్గెనో
అతులిత మాధురీమహిమ నా మును మీ పెదతాతచాల స
న్నుతి గనెఁ గృష్ణరాయల మనోజ్ఞ సభన్........."

అని తన కృష్ణరాయ విజయమునందు వ్రాసికొనుటం బట్టియు, సర్వత్ర గ్రంథాంత గద్యములో—

("ధూర్జటిపౌత్ర")

అని వ్రాసికొనుటంబట్టియు శ్రీపంతులవారు ధూర్జటిని బాలించిన కృష్ణదేవరాయల కాలమునుండి స్థూలదృష్టితో గణించి మున్నుదాహరించిన తెఱంగున నిర్ణయించియున్నారు కాని ప్రకృత గ్రంథమునుగృతినందిన నరసింహాప్పారావుగారి పితామహులగు విజయాప్పారావుగారు రాజ్యమునకు వచ్చినకాలము 1077 వ ఫసలీకి సరియగు 1667 వ సంవ

త్సరమని నూజవీటి యెస్టేటు విభాగపు జడ్జిమెంటులో విస్పష్టముగాఁ గనుపట్టుచుంటం జేసియు, నియ్యాసఘుని మనుమఁడగు ప్రకృతకృతినేతకే యంకితమీఁబడిన "అప్పరాయయశశ్చంద్రోదయము"ను రచియించిన ఆదివిళ్ళ వెంకటశాస్త్రిలవారును, కుంచిముంచి జగ్గకవియు నొకటే కాలమువారనుట నిర్వివాదాంశమనుటకు శ్రీ పంతులవారిచేతనే వ్రాయఁబడిన జగ్గకవిచరిత్రము సాక్ష్యమొసఁగుచుటచేతను కుమార ధూర్జటి నిగూర్చి పంతులగారు చేసిన కాలనిర్ణయములో మేమేకీభవింపఁ జాలకున్నారము. కృష్ణదేవరాయలనుగూర్చి పంతులవారొనర్చిన కాలనిర్ణయము సరియైనదైనచో నతని కాలమునను న్నకవికి మనుమఁడగు కుమారధూర్జటివిషయమున వారువ్రాసినది సరియైనదనుకొనవచ్చును గాని వారాపుట్టమునందనేక వికల్పములు లిఖించుటచేఁ బ్రకృతమువారి వ్రాఁత నుపేక్షించి 1577 వ సం॥రము వఱకును కృష్ణదేవరాయలు రాజ్యముచేసెనని వ్రాసిన శ్రీ గురుజాడ రామమూర్తిపంతులవారి యూహానే మేమిందనుసరించుచున్నాము. పంతులవారి వ్రాఁతను బట్టి మని కృతిపతితాతగారు రాజ్యాభిషేకమునకువచ్చిన వత్సరమునకు నూఱిరువత్సరములకు మున్నె గతించిన కుమారధూర్జటి మరల 120 వత్సరములకిటీవల నవతరింపవలసివచ్చును. అది సర్వవిధముల నపహాస్యాస్పదమని వేఱుగ వ్రాయనక్కఱలేదు. అందుచే మార్గాంతరమునుబట్టక తప్పదు, కాని 1577 వ సం॥ ప్రాంతమున స్వర్గతినందిన కృష్ణదేవరాయలయాస్థానమునను న్న మొదటిధూర్జటికి మనుమఁడగు కుమార ధూర్జటి 1700 ల సంవత్సర ప్రాంతమునఁ బ్రభుత్వమొనర్చుచున్న నరసింహాప్పరాయనికి సుమారు ముప్పది వత్సరములని చెప్పఁదగు తన ప్రాయములోఁ గృతినిచ్చుట సంభవించెనా? అనునది సుంత విచార్యమే కాన,

("మునుమీఁ పెదతాత")

అను కుమారధూర్జటివాక్యముంబట్టి మొదటి ధూర్జటికిఁ జాల మంది తమ్ములు గలరనియు నందులో నతనికంటెఁ జాలఁ జిన్నవాఁడగు వాఁడితని తాతయై యుండవచ్చుననియు నతనికిఁగూడఁ బలువురు తన యులుండురనియు నందులో నితని తండ్రి యించుమించు కడగొట్టుతమ్ముఁడై యుండునేమోయనియు నతనికుదయించిన పుత్రులలోఁ బ్రకృతకవికూడఁ జిన్నవాఁడే యగునేమోయనియు నెంచుకొంటిమేని యీ మధ్యఁగల కాలమును దగ్గించిచెప్పుగాఁ బంచవచ్చునని తోఁచెడిని. లేదా జడ్జిమెంటులోని 1565, అనునది ప్రమాదమనియేని యనుకోవలెను. జగ్గకవి కాలనిర్ణయమును బట్టిచూచిన జడ్జిమెంటు సరిపోవుచున్నది. పరిశీలకులింకను విచారించి నిజమును గనుఁగొనఁగోరుచున్నారము.—

"ఉ॥ చిత్రముగాఁగఁ జిన్నపుడె చేసితివారసముల్ చెలంగ సా
విత్రిచరిత్రమున్ మిగులవేడుక నిందుమతీ వివాహమున్॥"

అనియును

"క॥ బాలుఁడవయ్యును విద్యాశీలుఁడవు"

అనియును కుమారధూర్జటి కృష్ణరాయవిజయమునందుఁ బ్రస్తావించుటచే నీయిందుమతీ పరిణయమును మిక్కిలి చిన్నతనమునందే వ్రాసినట్లూహింపవలసియున్నను, నది యతిశయోక్తిగా భావించి మే మితఁడీగ్రంథమును యౌవనదశలో నే వ్రాసినట్లభిప్రాయపడుచున్నారము మేము పంతులవారి నిర్ణయమున కతిక్రమించుటకుఁగారణము ప్రత్యక్షప్రమాణ లబ్ధమగు నాధారముగాని వేఱుగాదు ప్రత్యక్ష ప్రమాణము లేనిచో ననుమానమే శరణమగునుగాని యది యున్నపుడు దానిం ద్యజించి యనుమానము నేలపట్టవలెను. జగ్గకవినిగూర్చిన కాలనిర్ణయ

ము మాకుఁ దోడ్పడుచున్న దని మున్నే వ్రాసియుంటిమి. ఇందుమతీ పరిణయమును గృతినందిన ప్రభువును, అప్పరాయ యశశ్చంద్రోదయమను గృతినందిన ప్రభువును నొకరేయనుటకుఁ బ్రబల నిదర్శనము పంతులవారొనర్చిన జగ్గకవినిగూర్చిన కాలనిర్ణయమొకాక నిన్న మొన్న రచించిన పారసీక ధరాధీశచరిత్రములోని యీ క్రిందిపద్యము గూడనని చెప్పవచ్చును—

క॥ ఇందుమతీ పరిణయముఖ। సుందరకావ్యములు పెక్కు సుకవులుగొనిరా
నందెఁగృతి నాయకత్వ ము। నందానందమున వారి మన్నించితగన్॥

పైపద్యములో నిందుమతీపరిణయకృతినాయకుఁడు మఱికొన్ని గ్రంథములనుగూడఁ గృతినందినట్లు స్ఫుటమగు చున్నది. ఆ పెక్కు కృతులలో నీ 'యప్పరాయ యశశ్చంద్రోదయ' మొకటియని యెఱుఁగఁదగు ఈయంశము జగ్గవికూడఁ దనతిట్టుపొత్తమున లిఖించియేయున్నాఁడు.

క॥ అప్పారావుకుఁ గావ్యము, చెప్ప నతండీఁగ నందుఁ జేరెను వినయం
బొప్పఁగ వెంకటశాస్త్రిలు, గుప్పనతఁడాణి విల్లనులుఁ డెన్నంగన్

ప్రకృతముగామింజేసి యీజగ్గకవికిని, యశశ్చంద్రోదయ గ్రంథకర్తకునుగల తారతమ్య మిందువ్రాయవలెదు వారి వీరిగ్రంథములు తిలకించినవారు వీరిరువురకును 'హస్తిమశకాంతరమనియు నందుచేత నే యీతిట్లు జనించియుండుననియు నిర్ణయింతురని మాత్రమువ్రాసి మరలఁ బ్రకృతమున కుపక్రమించెదము. పైనుదాహరించిన' పారసీకధరాధీశచరిత్ర నిన్న మొన్న అనఁగా నేఁటికి 8 వత్సరములవఱకును జీవించియున్న శ్రీ రంగయ్యాప్పారావుగారు రచింపఁజేసినది. గ్రంథకర్తలక్ష్మణాచార్యులను సుకవి, ఈగ్రంథము భారతాదులవలెఁ జాల పెద్దదిగా నుండునని మాతృకవలనఁ దెలియవచ్చుచున్నది గాని యచ్చుపడి మాకాసంస్థాన ప్రభులవలన లభించిన గ్రంథమొక యాశ్వాసము మాత్రమే, దానిలో వంశవర్ణనములో నిందుమతీపరిణయము కృతినందిన ప్రకృతప్రభువు నిట్లు వర్ణించియున్నాఁడు.

చ॥ అరుదుగ నూజివీడుపురిని హర్మ్యనికేతన సౌధరాజిచేఁ
బరఁగెడు దుర్గమెుక్కఁడు వివస్వతునంపెడుగానిఁగట్టె "దర
హ్వారు, వజలాల్తు దస్తుగహా" యన్ బిరుదుల్ గొనె మూడువేలసం
గరనిపుణుల్ భటుల్ గొలువఁ గాఁదగెనారసింహుఁ డెంతయున్"

పైపద్యమువలనను, "ఇందుమతీపరిణయ" అనుపద్యము వలనను నియ్యనముఁడు సర్వవిధములఁ గృతార్థుఁడనియుఁ దనతాతయగు విజయాప్పరాయనికన్న మిన్నయనియుఁ జెప్పవలసియున్నది. ఈయనకు మూడవతరమువాఁడగు వేంకటనరసింహరావను నామాంతరముగల నారయ్యప్పారావను ధర్మప్పారాయ సార్థకనాముఁడుగూడ మహాపురుషుఁడని చెప్పవలసియున్నది. అది ముందు ప్రస్తావింపఁబడును వేయేల యీవంశమునం దెవ్వరో తక్క నెల్లరును మహాపురుషులును ధర్మాత్ములును ననుట కేవిధమైన సందియమును లేదు. అదియటులుండె. ఈయిందుమతీపరిణయకృతినేతవఱకు మాత్రమే ధూర్జటికవి వంశమును వర్ణింపవలసినవాఁడు, పదపటిప్రభువులనుగూర్చి పారసీక ధరాధీశచరిత్ర నుండి ముఖ్యములగు పద్యభాగములు గొన్ని యుదాహరించుచున్నారము.

సీ॥ తనదుకీర్తిద్యుతుల్ దశదిగ్జ్ఞాననవాకచముల సుమదామరుచులనీన,.... .
తే॥ గీ॥ అతనితమ్ముఁడు శోభనాద్ర్యప్పరాయ విభుఁడు తద్రాజ్యమువహించె విభవములర
క॥ ఆనరనాథుఁడు ముప్పురమానవతీమణుల నొక్కమగువతనయలన్
మానుగబెండిలియై యసమానవిభూతింజెలంగి మహి నుతిగనియెన్
చ॥ అటు నుతిగాంచు నాముగురయందును బట్టపుదేవి యొప్పు నుత్కటపతిభక్తిచే
నలరి కాంతుఁడు కాలవశమ్మునొందఁ దాఁ। బటుతర సాహసంబెనయ భర్తను
వీడఁగఁజాల నంచు నొ। క్కటఁ బతితోఁ జితానల శిఖాతతి కాహుతిఁజేసె
దేహమున్॥'

క॥ పొచ్చెమ్ములేక తక్కిన బుచ్చమ రమణమ్మలనెడి పొలఁతులిరువురున్
మచ్చికచేఁ బతి రాజ్యంబచ్చుగఁ బాలించి రహితులతి భయమందన్॥

ఉ॥ ఆసుదతీలలామలు . . . నిజవంశము వృద్ధియొనర్ప. . . ఆత్మగోత్రజాశుభ
ప్రదిలక్షణు వేంకటాద్రినా॥ భాసిలు రాజపుత్రకుని దెచ్చిప్రియంబెలర్పఁగన్॥

తే॥ గీ॥ అతని నిజరాజ్యమున కధిపతి నొనర్ప నతఁడు సంతోషభరితాంతరంగుఁడగుచు
తమ్ముఁడగు నారసింహభూధవుని కెలమి నర్ధరాజ్యమొసంగె నత్యద్భుతముగ॥

తే॥ గీ॥ కొంతకాలమ్ము చనఁ దదనంతరమునఁ, వెంకటాద్ర్యప్పరాయభూవిభుఁడు పుడమి
విడిచి సుస్థిరభోగేచ్ఛగడలుకొనఁగ శ్రీనివాసపదమ్ముదాఁ జేరనంత॥

తే॥ గీ॥ వెంకటాద్ర్యప్పరాయభూవిభుని పిదప రెండు రాజ్యమ్ములాత్మదోర్దండశ్రీని
నొకటిగా నిల్పె నారసింహోర్వినాథుఁ డేలె శాత్రవులడవులపాలుగాఁగ॥

క॥ ఆ నారసింహధరణీజానియె నారయ్యధరణిజానియనుచుఁదా
మానితముగ రెండవయభిధానమ్మునవిస్తృతప్రథన్ మహిమించెన్॥

గీ॥ అన్నారయేంద్రధరాజాని తే॥ గీ॥
ఇట్టులేవురఁబెండ్లియై చెనఁగెనితఁడు॥
అందు॥

తే॥ గీ॥ రావువంశాబ్ధిపూర్ణచంద్రప్రభాయ మానమూడవభార్యసన్మాన్యచరిత
వేంకమాంబిక సకలసాధ్వీమతల్లి యెలమి వేంకట నారసింహేంద్రుఁగనియె॥

సీ॥ కొల్లేటిధరణి నెక్కొనుమహామశకవితతిజాతకండూతి గాఢపీడ
నలమటఁజెందియాయువనివృత్తివిహీనయగుటఁగండువుఁబాయ ననువుకనక
మహిపాలసత్త్వముల్ మల్లడిగొనుచుండఁ బరికించిమదిఁ గనికరమువొడమ
నున్నతశిలల నయ్యుర్వినందందుల నాటించి వాటిపై తీటలుడిపె

తే॥ గీ॥ నహహ వెంకట నారసింహాప్పరాయ భూతలేంద్రుని కెంతటి భూతదయయొ
యిమ్మహోదారుసత్కథ లెల్లదిశల గాన మొనరించెదరు పుణ్యకరములనుచు॥

తే॥ గీ॥ యాత్రకై యేగుదెంచెడు నాత్తరాహ సాధుజనులకు నారాజచంద్రుఁడపుడు
కలశములు వస్త్రములు మఱిఁగంబళములు నొసఁగి మృష్టాన్నమిడి తృప్తినొందఁజేయు॥

" నారయ్యప్పారావుస్వామిసన్నిధిపైటె"

అనుగీతము సర్వత్రసుప్రసిద్ధము పైపద్యములోని ధర్మములెల్ల నందు విస్తరించియున్నవి వలయువారద్దానికతన నెఱుఁగఁదగు. ఈవిషయమై మాగీరతభాగములలో నొకటియగు విగ్రహారాధనమునందిట్లు ప్రసంగవశమునంబ్రశంసించియుంటిమి.

# VIII

తే॥ గీ॥ . రామచంద్రాప్పరాయ భూరమణతిలకు మతి/ ...ంహాప్పరాయధీమహితు
గనియె

సీ॥ తే॥గీ॥ రామచంద్రాప్పరాయభూరమణునకును సుబ్బమయు సీతమయు నావిశుద్ధచరిత
లైనపత్నులుగల రిద్దఱు . . ..

సీ॥ రామచంద్రమహీపురందరుం డల సీతమాంబికయందు . ...
శోభనాద్ర్యప్పరాయు భూసురవిధేయుఁ గనియె. ."

తే॥ గీ॥ మాలితాభిఖ్య శ్రీసుబ్బమాంబ మఱియు, రమణమయు నాఁగ నిద్దఱురమణు
లా నృపాలచంద్రుని భార్యలు. "

సీ॥ ఆసుబ్బమాంబికయం దల్ల శ్రీశోభనాద్ర్యప్పరాయధరాధినాథుఁ
డనఘు (1) నారయ్యధరాధీశు (2) రంగభూనాథుఁ (3) జగన్నాథనరవరేణ్యు
(4) వేంకటనరసింహవిభు, (5) వేంకటాద్రినృపాలు (6) సింహాద్రిభూపాలతిలకు
(7) వేంకటరామపృథ్వీనాథుఁడనియెడి నేడ్వురసుతుల మహీశనుతులఁ
దతసురాహారహారహారసితసితాభ్ర హీరతారాగతారేశశారతరు సు
పర్వరాడర్వకరిగర్వధూర్వహ ప్రశస్తకీర్తులఁగనియె సత్సమితివొగడ"

ఈపద్యమునందుఁ జేర్కొనఁబడిన యేడుగురు ప్రభువులలోఁ బ్రకృతిగ్రంధమునుద్ధరించినవారు నారయ్యప్పారావుగారి మనుమలు, ఈనారయ్యప్పారావుగారి శాఖను దుట్టతుదను జెప్పఁదలఁచి యిందు రెండవవారు మొదలుకొని యాయాసోదరుల యభివృద్ధ్యాదులను సంగ్రహముగా నింతకుమున్నుదాహరించుచున్న పొత్తమునుండియే యుదహరించుచున్నారము.

తే॥ గీ॥ అందు మత్కృతినాథుఁడైయమరు రంగ ధారుణీనాథు నమితమేధాసనాథు
నమరనుతగాథుఁ గీర్తితారాధినాథు నెన్నశక్యంబె వేమోళ్లమిన్నకైన॥

ఇందుఁ జేర్కొనఁబడిన శ్రీ రంగయ్యప్పారావుగారు పైసోదరులలో రెండవవారు, వీరికొక కొమార్తమాత్రము కలదు, వారినిగూర్చి యీక్రిందిపద్యము చెప్పాను.

శా॥ శ్రీమద్రంగనృపాలశేఖరుఁడు లక్ష్మీచెల్లమాంబాసతీ
సీమంతిన్యవతంసమందుఁ గనియెన్ శీతాంశుభాస్వద్యశ

ఉ॥ ఎంచికనంగ లేవుకద? యెన్నఁడు నర్భక! "నారయప్ప రా"
వంచును "స్వామిసన్నిధి" యటంచును "బైటె" యటంచుఁ దంబురా
గొంచును దెంచు భిక్షుకులఁ గొండొక రేని స్మరింప రేమి? య
య్యంచితు వాసిగా సిలుట కానొకొ మానము లిట్టి గానముల్॥

ఉ॥ ఎవ్వని పేరు చెప్పికొన నించుక ముష్టియుఁ గూడఁ బుట్టదా
గవ్వ నెవండు పాడుఁ ద్రిజగమ్ములు మోసినవానిఁ దక్క నీ
నవ్వున కర్థమేమి? యల నారయభూవరునుం దలంతియే
యెవ్వరు నీకుఁ జెప్పఁగల రేదిగొ యిక్కడ తోఁచినట్లుగన్

మఱియు నీయప్పరాయలకు ధర్మప్పరావను సార్థక బిరుద నామము సర్వత్ర సుప్రసిద్ధము, ఈయన ఘునినిగూర్చిన పుణ్యకథ లెన్నియో జనులు గడువిశ్వాసముతోఁ జెప్పికొనుచుందురు. ఈయన యవసానకాలమున సూర్యమండలము భేదిల్లినట్లుగాఁ గొందఱు పుణ్యాత్ములు కాంచినట్లు వినుచున్నారము. మరలఁ బ్రకృతాంశమున కుపక్రమింతము. ఈధర్మప్రభువు మనయిందుమతీపరిణయ కృతినేతకు మూడవ పురుషుఁడనునది ప్రస్తుతాంశము, ఈతరువాతి వంశీయులంగూర్చి కూడఁ గొంచొక యాచరిత్రమునుండియే యుదాహరింతముగాక

క॥ "ఆనరపతికి న్నలువురు మానవతులు భార్యలు"

ఉ॥ వేంకటనారసింహపృథివీపతి గాంచెను నారయేంద్రుఁడున్

క॥ ఆతని కిర్వురు భార్యలు శ్రీపాపమాంబ మఱి చిన్నమయున్

సీ॥ తే॥గీ॥ భర్త్రీచు జ్ఞావిధిజ్ఞ శ్రీపాపమాంబ పూజ్యతమముగఁ బెక్కేండ్లు రాజ్యమేలె

వ॥ ఇట్లు వెంకటనృసింహభూపాలు వంశంబు పాపమాంబికాపర్యంతంబు నభివర్ణించి మరలఁ గృతిపతియగు రంగభూపాలు వంశాభివర్ణనంబు గావించువాఁడనయి తత్ప్రపితామహుఁడగు నాఁ సింహవిభుని మైదవపల్లి నభివర్ణించెద

సీ॥ తే॥గీ॥ . నాగసింహభూతలపహేంద్రు మైదవవధూవరేణ్య పుణ్యాభిగణ్య
వెంకమాంబిక చెలువొందు విభుని వె అసి

సీ॥ అన్నారసింహేంద్రుఁ డత్తలోదరియందు .... ....

ఈనెల సొమ్ము చెల్లించిన చందాదారులు.

1 గరికెపాటి సుబ్బారాయుడుగారు గుంటూరు
2 మల్లాది కామయ్యగారు చింతపల్లిదొరసానిసంస్థానము గుంటూరు
3 కాకుమాను వెంకటనరసింహముగారు గుంటూరు
4 న్యాసతి హనుమంతరావుగారు ప్లీడరు గుంటూరు
5 పెద్దిభట్ల పెదనాగేశ్వరరావుగారు తహశీల్దారు గురిజాల
6 రాజా వాసిరెడ్డి చంద్రమౌళీశ్వరప్రసాదు బహదరు జమీందారు గారు, ముక్త్యాల
7 కలువలపల్లి రంగయ్యశాస్త్రిగారు, భాస్కరాచార్యులు, ఏలూరు
8 బుడంపాటి సుబ్బయ్యగారు రాజమహేంద్రవరము
9 దూపాటి తిరుమల వెంకటరత్నమాచార్యులుగారు, స్కూల్ మాస్టరు కమ్మవారిపాలెము
10 పోలేపెద్ది నాగభూషణముగారు రాజాపేట
11 చతుర్వేదుల నరసింహముగారు విప్పర్లపల్లె
12 సయ్యదుఖాసీమ్‌సాహేబుగారు ఫారెష్టుగార్డు చింతపల్లి
13 తూములూరు సదాశివయ్యగారు కరణము చివలూరు
14 చల్లా పిచ్చయ్యశాస్త్రిగారు ఇంటూరు
15 దిడుగు కాంతయ్యగారు పెదకొండముగుండ్ల
16 సన్నిధానము విశ్వనాధశాస్త్రిగారు లైసెన్సు గుమాస్తా చోట పాపయపాలెము
17 ఫణిభట్ల రాజేశ్వరశాస్త్రిగారు నూజవీడు
18 సోమయాజుల వెంకటసుబ్బయ్యగారు దుగ్గిరాల
19 ప్రభల వీరరాఘవులుగారు ప్లీడరు తెనాలి
20 కప్పగంతుల వెంకటసుబ్బయ్యగారు బాపట్ల
21 భువనగిరి ముకుందరామయ్యగారు రివిన్యూయినస్పెక్టరు బాపట్ల
22 నోరి వెంకటేశ్వరులుగారు ప్లీడరు బాపట్ల
23 చిందినాడ వెంకటరత్నశాస్త్రిగారు బెజవాడ
24 జయంతి రామయ్యపంతులుగారు ప్రెసిడెన్సీమేజస్ట్రీటు మదరాసు
25 కుస్తిసెట్టి వెంకరత్నముగారు నందెపూండి
26 రామరాజు సీతారామయ్యగారు కరణము వ్యాపకంపల్లె

# ప్రధానపోషకులు

శ్రీ శ్రీ జగద్గురు విరూపాక్షస్వాములవారు.

## పోషకులు.

1 శ్రీ రాజా నారయప్పారావు సింహాద్య్రిప్పారావు బహాదరు
జమీందారులు, నూజవీడు.

2 శ్రీ రాజా కోటగిరి వెంకటకృష్ణారావు బహాదరు
జమీందారుగారు గంపలగూడెం

3 అల్లాడి లక్ష్మణరావుగారు కరణము జంగపల్లి

4 రామసింగుగారు నెల్లుట్ల షాపురపు సంస్థానము మానేజరు నెల్లుట్ల

5 రంగావఝ్ఝుల హనుమయ్యగారు జిల్లాకోర్టువకీలు గుంటూరు

6 తాడేపల్లి లక్ష్మీనరసింహారావుగారు మక్తాదారు చోల్లేరు

7 బీరకాయలరామారావు దేశముఖుగారు రాయగిరి

## సహాయులు.

1 అన్నమురాజు సుబ్బారావుగారు నందూరు

2 నందూరు నరసింహారావుగారు, కరణం, నందూరు

3 నైషధము సీతాకాంతముగారు మోరంపూడి

4 మెదకు శేషారావు దేశముఖుగారు, నల్లబల్లి.

5 కుప్పా శంకరశాస్త్రిగారు, చిపలూరు.

6 గంభీరరావు దేశాయిగారు, లింగన్నపేట.

7 నారసింహారెడ్డి దేశాయిగారు, కాసర్లబాద.

8 కొండపల్లి అనంతరామయ్యగారు, వకీలు. జానగాం.

9 పిరాట్ల సీతాకాంతముగారు, చింతపల్లి.

10 కాకుమాను హనుమయ్యగారు, నర్సారావుపేట.

11 తంగెడ నరసింహారావుగారు, కరణం, మోర్జంపాడు.

12 చెన్నూరు రాఘురంగారావు దేశపాండ్యాగారు, పెదవీడు.

13 వాసిరెడ్డి వెత్రయ్యగారు, చేబ్రోలు.

14 వెలుగూరి పిచ్చయ్యగారు, కొడమగుండ్ల.

15 తుమురుగోటి నరసింహారావుగారు, తిరుమలగిరి.

16 వెంకటరామకవులు, పల్నాడుతాలూకా